శ్రీరామచంద్ర.

# ఆర్తరక్షామణి



ఇత్యాది

గన్నవరపు సూర్యనారాయణ మూర్తిచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు

**Vegu-Jukka Printing Works,**

**Berhampore, (Ganjam).**

**1920.**

 వెల రు. 0—4—0లు.

# మోహినీవసంతము.

ఈ నాటకము 'షేక్స్పియర్' మహాకవి రచించిన సింబెలెన్ అను కథననుసరించి ప్రతిపద్యమును ముద్దులుమూటగట్టు చుండు శైలితో, మనోహరములగు భావములతో వ్రాయఁబడి యాంధ్రభాషా యోషామణికి నూతనాలంకారమువలెఁ బ్రకాశించుచు గ్రంథమును గొంతవరకు జదివినగాని విడువ బుద్ధి పుట్టనీయదు. అప్పుడే రెండవ కూర్పునకు సిద్ధముగ నున్నది. వెల రు. 0 — 12 — 0లు మాత్రమే.

గ్రంథకర్త:—గన్నవరపు సూర్యనారాయణమూర్తి,
బరంపురం, (గంజాంజిల్లా.)

# ప్రచండవిజయము.

లేక,

## సైంధవాస్తమానము.

ఇదియొక వీరరస ప్రధానమైన నాటకము. ఇందలికథ భారతమునుండి గ్రహించి మ॥ రా॥ రా॥ గన్నవరపు సూర్యనారాయణ మూర్తిగారిచే రచింపఁ బడినది. ప్రతి పద్యమును ముద్దులుమూటగట్టు నవీనములగు భావములతో విలసిల్లుచు నిట్టినాటకము మనయాంధ్రభాషలో మరియొకటికలదా యను సంశయము చదివిన ప్రతివారికిని గలుగకమానదు. కొలది ప్రతులు మాత్రమే యున్నవి. వెల రు. 0—8—0లు

వలయువారు:—

కోట్ని కృష్ణమూర్తి, బరంపురం, గంజాంజిల్లా.

అని వ్రాసిన బడయగలరు.

# పీఠిక

నేను 1916 వ సం॥ర॥ మున 'ప్రచండవిజయము' అను పేర నర్జునుఁడు సైంధవుని జంపుటయు, 1918వ సం॥ర॥ మున 'షేక్స్పియర్' మహాకవి రచించిన 'సింబలైన్' (Simbaline) అను కథను ''మోహినీవసంతము'' అను పేరను నాటకరూపము లుగా రచించి ప్రచురించిన పిదప నేటివరకు మరొక్క గ్రంథము ను ప్రకటించుటకు యుద్ధకారణమున శ్శక్తిఁ జాలని వాఁడ నయ్యు, సంసార సముద్రమునుండి తరించి జన్మసాఫల్య మొంఁ దుటకుగాను నీకృతి భగవత్కైంకర్యముగా నొకదినమున వ్రా సియుంచుటచే విద్గావినిమాత్రము ప్రచురింప సాహసింపఁ గలిగి తిని. 'ప్రమాదో ధీమతామపి' అను న్యాయానుసారము ఈ కృతియందెచ్చటనయినఁ బొరపాటులున్న గుణగ్రహణ పారీణు లగు పండిత పాఠకమహాశయు లవ్వాటిని దెలియఁజేసినచో వా రికెంతయు విధేయుఁడనై రెండవకూర్పునందు చేతులుజోడించు కొని వాటిని సవరించుకొనువాఁడను.

బరంపురం — ఇట్లు బుధజన విధేయుఁడు,

25—1—1920 — గన్నవరపు సూర్యనారాయణమూర్తి.

# పండితాభిప్రాయము.

ఈకృతివిషయమై మా॥ రా॥ రా॥ కవిగుర్వవరకాళిదాస సమస్తాగమ సర్వతంత్ర స్వతంత్రాద్యనేక బిరుదాంకితులును, సువర్చలా పరిణయము లేక హనుమద్వివాహ గ్రంథకర్తలు నగు పూడిపెద్ది లింగమూర్తి పంతులుగారిచే సహార్ధికా పూర్వకముగా నొసంగఁబడినది.

శా. బర్హంపూరున గన్నవర్పనెడి సద్వంశ్యుండవై వింశతి
ప్రాక్షప్రాయమునం దనర్గళకవిత్వానూన వాగ్ధాటిచే
నిర్మేయాత్మకలన్ శతాబ్దము "లవంతీవార్ధిదంత్యంబుదా"
ప్రార్థ్యత్వంబులఁ జేసితివి కృతినంచత్ సూర్యనారాయణా.

31—1—1920 ఇట్లు,

బరంపురం, పూడిపెద్ది లింగమూర్తి



శ్రీ రామచంద్ర.

# ఆర్తరక్షామణి.



శ్లో॥ సాకేతే మణికోటిదీప్తి భవనే కందర్ప సామ్యాకృతిమ్
రూపే షోడశచంద్రకాంతి హసనమ్ శ్రీజానకీసేవితమ్
కారుణ్యాన్విత వీక్షణమ్ మునిహితమ్ కాకుత్స్థ వంశోద్భవమ్
శాంతమ్ సజ్జనసాధుసంఘవినుతమ్ శ్రీరామచంద్రమ్ భజే.

శా. హేసీతాధిప! హేజగత్త్రయగురో! హేభక్తమందార! కై
లాసాధీశ మహేశ్వరాది నుత! లంకేశ జీవాపహా!
దాసోహమ్మని వేఁడుచుంటి నిదె విద్యాశూన్యుఁడన్ గాన నే
నీ సత్యంబు గణింపలేకకట! తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. ఖలుఁడౌపుత్త్రుఁ డవన్నికానిషములం గావించినం బుత్రవ
త్సలతన్ వానిని వానితండ్రి దయచేతం జూచుచందంబు నే
ఖలుఁడన్, మూర్ఖుఁడ, దుష్టబుద్ధినయినం గాపాడిరక్షింప నె
వ్వలనం దండ్రివి నేనుపుత్త్రుఁడను దేవా! ఆర్తరక్షామణీ!.

శా. దేవా! దేవర పాదపద్మముల భక్తిఁగావీడి మూఢుండనై
యేవేళన్ గడు ఘోరపాపముల నేనెన్నేని గావించి హా
జీవాధార! భయంబుఁగొంటిఁ బవరాశివంబులం గొల్వఁగా
నీవే దిక్కని చేరవచ్చితిని తండ్రీ! ఆర్తరక్షామణీ!.

శా. ఎన్నేనన్మ్యో దినంబులే జననమ్ము యీ భూమిపై దేవ! నే
మున్నాకర్షప్పుడు మందబుద్ధిని "ప్రభో! లోకేశ! చిద్రూపసం
పన్నా! బ్రోవవె"యంచు భక్తిఁ బలుక న్పాపాత్ముడనౌ తండ్రి! న
న్గన్నన్నాతను శ్రీమఁజాపు నుతుఁడన్ గానార్త రక్షామణీ!.

శా. ఏవో చేసితిఁ జేయరానివనుచే నెన్నింటినో నైన నా
భావంబిన్ పదారువీసములు త్వత్పాదాబ్జముల్ దిక్కుగా
భీవైరాగ్యుని భంగినిల్చె నడిపీథిన్ నన్ను నిల్పెట్టి మే
తా! వాలాయముగాను దీనుఁడను గానా? ఆర్త రక్షామణీ!.

శా. అన్నా! యేమనవచింపనెంతును మహాత్మా! పూర్వజన్మంబు
నం! దెన్నింటిన్గదు దుష్కృతంబులకటా! యేఁ జేసినానో యిటు
ల్కన్నీ రోడికవిూర వానిఁ గుడువంగా వచ్చెఁ దండ్రి! యిఁకన్
వన్నాదింపవు దీనపాలుఁడ వనంతా! ఆర్త రక్షామణీ!

శా. మేలుంగీమమజాది బ్రోచుటదినుమ్మి ధర్మమా దేవ! ఏ
వేళన్ దానిని వీడరవ్వారన నీపాదానిఁ బోవిఁడిన్
జాలన్నేర్తునె? తెల్విహీనతను మున్ గావించు పాపాలికిన్
జాలన్ దోసిలి యొగ్గినాఁడఁగద ఈశా! ఆర్త రక్షామణీ!.

శా. పాపాత్ముండను, దుర్మదాంధుడను దివ్యజ్ఞానహీనుండ, పె
గోపిన్, దూర్తుఁడ నంచునెంచి యముఁడున్ గోపించి యేరీతి నో
భూపా! బాధలఁ ద్రోయునోయనుచు నన్ బ్రోవంగ నీకిట్టి నే
నీపాదంబులఁ బట్టినాఁడఁగద, తండ్రి! ఆర్త రక్షామణీ!.

మ. సౌశైశ్వర్య సమృద్ధిచే, సుజన రక్షాదక్ష నవ్యోక్తిమ
హితమై వర్ణైదుకల్మిచే, భువనముల్ దేదీప్యమానంబులై
వ్రకటంబౌగతిఁ జేయునేర్పునను దేవా! వెల్గునీవుండ నిం
కొకరిన్ వేఁడఁగఁ జేయునాతున? కృపాబ్ధీ! ఆర్తరక్షామణీ!.

మ. తనుబాల్యంబున తండ్రివీఁడిచనఁగా నాతండ్రి! నాతండ్రిక
న్ననుఁ బ్రేమంబునఁ బెంచెనీవనుచు నెన్నంగరాని మోహంబుచే
తనుప్రేమనుండఁగ నాదునాశ నకటా! తాత్పర్యముగాఁ జేతువే?
యనఘా! యేనికనేమిసేతు నిదిమేలా? ఆర్తరక్షామణీ!.

మ. పుడమిన్ బుట్టినదాది నేటివరకున్ భూమిశ! మోహంబుతో
గడిమైనన్ జరియింపరామి నెపుడున్ గఁగోన లందఱుప్రుల్
దుడుకున్ దార్ఢ్యము తాపసప్తులకటా! దోగాము చుండంగ నే
ర్మ్యోదకుంటాయి మరేరి వేఁడెదను తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. ఎవరిన్ వేఁడిన నేమిచేసినను తండ్రీ! నీదు దిక్కౌటచే
భువి నే నన్యులఁ బంచఁ జేరకను దివ్యుల్ మెచ్చు త్వత్పాద సం
స్తవముం జేయుచు నిల్చియుంటి నను నిచ్చల్మెచ్చి రక్షింప మే
లవురా! శ్రీవర! దీనపాలుఁడవు గావా? ఆర్తరక్షామణీ!.

మ. కరుణాలేశము లేనివానివలె నన్ గాదింపఁగా నక్కటా!
పరుఁడన్గాను త్వదీయ సేవకుఁడ నాధారంబు నీదేకదా
భరియింపన్జాలు కన్నతండ్రి! యింక నాపాపాళిఁ బోఁద్రోచి దు
స్తర సంసార దవాగ్నిఁ గూల్చకు మహాత్మా! ఆర్తరక్షామణీ.

మ. ఘను నే జెప్పుకొనంగ సిగ్గగు జగన్నాథా! మఱేమందు ప్రా
నను నాతండ్రిటు వీడి చన్నదిమొదల్ నాకష్టముల్ జూచువా
ర్లును లేరంటను రోజురోజు నిటు నాలోనేని దుఃఖింపుచుం
దినముల్ బుచ్చుచు నిల్చియుంటిఁగద తండ్రీ! ఆర్తరక్షామణీ!

మ. కడుపే నంద్రిముగాఁగ నక్కటకటా! కాసంతయుం సిగ్గులే
కడుగరాని దుష్కృత్యకోటిఁ గని యాయాసంబునం వీడి నా
కిడుఁదంచుం జెయి సాచఁజాలనిఁక తండ్రీ! వేఁ గటాక్షించి నీ
యడుగుల్ సన్నిధి నన్నుఁజేర్చుము ముకుందా! ఆర్తరక్షామణీ!

శా. ముల్లోకంబుల బ్రోచుతండ్రివిగదా పోషింపనన్నొక్కనిం
ఫుల్లాంభోరుహ పత్రనేత్ర! బరువే? పోషింపఁగా రావె? నా
కిల్లుంవాకిలి సౌఖ్యముల్ వలదు తండ్రీ! చాలు నీసౌఖ్యముల్
కల్లల్ గావు పరంబొసంగు మది మేల్గా నార్తరక్షామణీ!.

శా. విశ్వంబందుఁ గలట్టి వస్తుచయముల్ వీక్షింపఁగా స్వప్నసౌ
ఖ్యశ్రేణాయిత కీర్తిసామ్యములుగాఁ గాంక్షింపఁగాఁజాలు మూ
ర్ఖశ్వానంబన? శాశ్వతంపు సుఖమా కైవల్యముం జూపుమా
శశ్వత్కీర్తి విరాజమాన! పరమేశా! ఆర్తరక్షామణీ!.

శా. ఎన్నాళ్ళాయెనొ తండ్రి! నీవెచవుమా? యాకితిఁ జెన్నాం
తుతో! నన్నా! పోవవె, పోవవే యనుచు నేనార్తుండనై వేడు
చుం గన్నీరోడికగట్ట నిల్చుటలు? నన్నాంతున్ విలోకించి మ
త్ఖిన్నత్వం బికనైన బావ దయరాదే? ఆర్తరక్షామణీ!.

శా. ఎంతస్వేఁడిన జూడకుండుట మహేశా! యెంతన్యాయంబో
శా! నంతైనం దలపోసిచూడు మదియే యానందమైయున్న 'నీ
వెంత స్వేఁడినఁ బ్రోవనిఁక మఱి యేదేని దగఁ జూచుకో
విన్నంతఁజాలు' నటంచుఁ బల్కఁగనురాదే? ఆర్తరక్షామణీ!.

శా. నే నీవాఁడ నటంచు గర్వమున నెందేఁ గాంచ రానట్టి క
ష్టానీతంబుల బాధలన్ దలఁపకే నానంద మగ్నుండనై
యేనాఁ డెంతటఁ గన్నులారఁగను తండ్రీ! నిన్ను వీక్షింపఁగా
నే నున్నానొ యటంచు నిల్చితివిగాదే? ఆర్తరక్షామణీ!.

శా. నాపై నింక ననుగ్రహం బునుపకున్నన్ న్యాయమా? దేవ!
నే! నీపాలన్ బడియుండుటన్ నిజమునన్ విప్రశుపాతంబుతో
భూపా, యేగతిఁ జూచినన్ పరిమె రాపుల్మాని యింకైన నీ
వే పాలింపంచిటు నిల్చినాఁడఁ గృపరాదే? ఆర్తరక్షామణీ!.

శా. ఒకనాఁడా! మఱి రెండునాళ్లా? జనకా! 'ఓ! రాఘవా! దీన
పా! లక! యార్తుండను, బ్రోవవేదయను, కాళ్లంబట్టెదన్, బుద్ధి
పూ! ర్వకమున్ జేసిన తప్పులేదు ననుగాపాడంగ రమ్మంచు నే
నకటా! యెంతని వేఁడుకొందుఁ? బరమాత్మా! ఆర్తరక్షామణీ!.

శా. ఏ జన్మంబునఁ జేసినట్టిఫలమో యీరీతి నన్ గట్టి తం
డ్రీ! బిట్టాడుచు నష్టకష్టములపా ల్జేశ్చింతతోఁ జేయుచున్
దేవం బందుచునుండ వేగ శరణార్థిన్ గాన బ్రోవంగ నా
పై జాలింతయుఁ జూపవే దయను దేవా! ఆర్తరక్షామణీ.

శా. ధనమున్ గోరఁగలేదు నీపదయుగధ్యానంబుచే భూములన్
ఘనసౌధాదుల మిద్దెలన్ నగరులన్ గాంక్షింపఁగా లేదు నే
నిను నే ప్రార్థనను గోరుచుందునది తండ్రీ! యొక్కసారైన నీ
వదనమ్ము కావున దర్శనంబిడఁగదే దేవా! ఆర్తరక్షామణీ!.

మ. కనులా కాయలు గాయుచుండె జనకా! కన్నారనిన్ గాంచనే
తనికిన్ దీనులకన్న దీనతను నెట్లో కాలమున్ బుచ్చుచుం
డిన నన్ బ్రోవ దలంపు గల్గినను తండ్రీ! యింక వేవేగ నీ
తనువాత్రించిన సంకేతాలు పరమాత్మా! ఆర్తరక్షామణీ!.

శా. పోనీగాని మరేమివద్దికను తప్పో యొప్పొ నీలోన నీ
వే నిక్కంబుగఁ జింతసేయు మిదియో యేఁ జేసితిన్ గాన తం
డ్రీ! నన్ బ్రోవుము దిక్కు లేదనుచు తా నిన్నెంత ప్రార్థించినన్
బైనొక్కింతయు జూపకుండుటలు దేవా! ఆర్తరక్షామణీ!.

మ. పగసాధింపఁ దలంచితేని జనకా! పైవాఁడనా నేను? ప్రే
మగ నీవుంటివి నాకటంచు మిగులన్ మోదంబులోనుందు నే
న! గణింపన్ బగవాఁడనైతి? సకటా! నాయాసఁ బోఁద్రోసి నీ
వ్వగలన్ ముంచుట పాడిగాదుసుమి దేవా! ఆర్తరక్షామణీ!.

మ. ఒకనాఁడైనను నీపదాంబుజములన్ నొక్కింత దుర్వృత్తినై
యుకటా! యేమరి యుండలేని నను నన్యాయంబుగాఁ బాధ సే
యఁ వంచైనను జాలిలేక నిటులన్ బాధించితే తండ్రీ! పి
తృకనై బిడ్డకరంబు పోల్కిగద రామా! ఆర్తరక్షామణీ!.

మ. అకలంకోజ్జ్వల దివ్యమూర్తి వయి మాయామోహహాలాహలో
హా! లక సామర్థ్యవిరాజితాతిశయుఁడై రంజిల్లి సద్భక్తులన్
బ్రోచేటామోద రసాబ్ధిఁ దేల్చు సకలాంతర్యామివౌ నీవు న
న్నే కనిన్ బ్రోవఁగ జాలకుందువె? కృపాబ్ధీ! ఆర్తరక్షామణీ!.

శా. ఎందుంజూచిన నీమహాత్మ్యము కదా యీచింత నాకేల? నా
నందంబొప్పఁగ నన్ ద్వదీయభజనా నందైక చిత్తంబుచే
నెందే వేళల నుండునట్లు జనకా! యేర్పర్చుమింకైన 'నా
నందో బ్రహ్మ' యటంచు వల్కుట ననంతా! ఆర్తరక్షామణీ!.

శా. జ్ఞానంబింతయు లేని మూర్ఖుఁడను విజ్ఞానమ్ముచే నింద్రియో
న్మానమ్మున్ విదళించి పూర్వభవ కర్మంబంధనం గ్రాఁగుచున్
మానంబున్ విడనాడి దుష్కృతములన్ గావింపఁగానుండు నన్
నీనైపుణ్యము జూపి కావుమిఁక తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. అవివేకాంబుధిఁ గూలకుండుటకు దివ్యజ్ఞానమున్ తెల్పవే
దివిషద్వర్గము సంతసించినటు లర్థింబూని నిన్వేఁడు నా
కవమానంబు ఘటింపఁజూడకుము దేవానీకమున్ బ్రోచు మే
లవురా! తండ్రి! తలంచు పుత్రుఁడను గానా? ఆర్తరక్షామణీ!.

శా. కామక్రోధ మదాదిలోభముల దుష్కార్యంబులెన్నెంటినో
భూమీశా! యొనరించి సిగ్గిలక ప్రాపుంగోరి త్వత్సన్నిధిన్
మోమాటంబున వేఁడుచుండు నను నొప్పుల్సైచి రక్షించినన్
నీ మాహాత్మ్యము గానుపించుఁగద తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. కలజీవంబులకెల్ల జీవుఁడవు, రాగద్వేషలోభాదు లె
వ్వలనన్ లేని మహామహుండవు నినుం బ్రార్థించు సత్ప్రాజ్ఞులౌ
బలుమార్గంబులఁ బ్రోచు తండ్రివయి దేవా! నన్ను నీకీర్తి బా
ధల పాల్జేసిన ధర్మమా? దయలేదా? ఆర్తరక్షామణీ!.

శా. నీ సంకల్పము సృష్టిచిత్రముగదా నిన్బోల్ప నేనెంత? నా
శాసామర్థ్యము గల్గెనేని జనకా! యాచింతునే నిన్ను? జే
రావన్ దీనుఁడ వేఁడుచుంటి నను నాయాసంబు పాల్సేయ మే
లా? సత్కీర్తికి లోటురాద? కనరావా? ఆర్తరక్షామణీ!.

మ. మునునన్బ్రోచిన యార్తులెందరినొ నమ్మోదంబున న్బ్రోచితి
వని గ్రంథంబులఁ గాంచియున్న నవి సత్యంబంచు నేనెంచ కెం
తును నన్నిప్పుడు బ్రోతువేని నిజమంచున్ గాన వేవేగ పా
వనమౌ తావక దర్శనంబిడుము దేవా, ఆర్తరక్షామణీ!.

మ. కలికాలంబున దుర్మదాంధులెమటన్ క్షామంబులో లేమిచే
బలుకష్టంబుల నొందుచున్న నను గాపాడంగ రాకున్న ని
య్యెల వేరెవ్వరు రక్షకుల్ గలరు? తండ్రీ! యెంత దుష్టుండనై
యుల జన్మించినఁ బాదసేవకుఁడఁ గానే? ఆర్తరక్షామణీ!.

మ. పరిదేహంబునఁ బ్రాశయాపమున దివ్యాంశైన తేజంబునన్
గత జన్మంపు ఫలంబు దేహి విధి సంకల్పించు మార్గంబు నీ
క్షితికొందన్ దగవెల్గు నిన్ను ననురక్తిఁ జేరఁగాంక్షించు న
న్నరిపేక్షన్ దయఁజూడుమొక్కెదను దేవా! ఆర్తరక్షామణీ!

శా. దుష్టుల్ దనుజ ముఖ్యగణంబు లరిపక్షు ల్భక్తులై నట్లు శు
ద్ధాంతాంతర ధరియించి లోకముల నుద్యల్లీలఁగాఁ జేసి సం
రక్షింపన్ దగు రక్షకుండవుగదా రక్షింపరావా? జగ
ద్రక్షా! రక్షకులెవ్వరింక గనరాదా? ఆర్తరక్షామణీ!.

శా. ఆశాపాశములెల్లఁ ద్రెంచుటను నీశా! యింకనిఁకగోర నే
యాశల్ నాకిటులేవుగాని నిను లోకారాధ్యుగా నెంచు చే
రాశన్ గాంచఁగనుంటి వేగ నను నాయానంబు పాల్సేయకీ
యాశన్ దీర్పు మిదొక్కటే గనుక దేవా! ఆర్తరక్షామణీ!.

మ. సుతుఁడన్, దీనుఁడ, బాదసేవకుఁడ నీనుంబూన నాబోటి దు
ర్మతిపై ధర్మమే? జనక! పారావార మింకింప, బల్
గిరులన్ లోకము లుద్ధరింపఁదగు లీలల్గాల్చు నీబోటికిన్?
బ్రతిపక్షుండని బ్రోవఁదుటకు? దేవా! ఆర్తరక్షామణీ!.

మ. గతజన్మంపు ఫలంబుచే గెలువశక్యం బెంతయున్ రాక పా
ర్వతికిన్ మంత్రివలోకెనుండు నరిషడ్వర్గంబులన్ జిక్కి దు
ర్మతినై దుర్భర దుఃఖసంద్రమున మున్కల్ వేయు నన్నాగ్రహా
మతినిన్ బ్రోవుము దీనపాలుఁడవు రామా! ఆర్తరక్షామణీ!.

మ. నిను ధ్యానించుచు నీపదాంబుజములే నిక్కంబుగానాకు ది
క్కని ధైర్యంబున నంతసించుటను నాయాశన్ విడం దీయకో
యనఘాత్మా! కరుణామయుండవుగదా యార్తుండనేనొంట నెం
తను గాపాడఁగ రమ్ము లెమ్ము వు దనంతా! ఆర్తరక్షామణీ!.

మ. కనుమూయన్ జగమంతశూన్యముగదా కామ్యంబులర్థించి
తీ। రని దుఃఖంబులు దెచ్చుకొందున ఘటప్రారబ్ధముఁ బొందఁ?
నో। యనఘా! యేనికనివ్వియెల్ల భవదీయాభిక్షతన్ గోరి యెం
తను ద్వత్సన్నిధిఁ దక్క నౌనన ననంతా! ఆర్తత్రాణమణీ!.

మ. మలమూత్రాన్వితమైనయీయొడలి ధర్మంబంతఁజింతింపఁగా
గలదే సౌఖ్యమొకింతయైన? నటులన్ గాంక్షించినన్ నీటి బుఁ
గల చందంబెకదా మరేల జనకా! నాకై విచారింప? పెం
పలరన్ ద్వత్సముఖమ్ము వేఁగొనఁగు దేవా! ఆర్తత్రాణమణీ!.

శా. ఆకాశంబున శబ్దముంబలెను దివ్యంబైన నీదివ్య లీ
లాకారంబు సమస్తలోకముల నుద్యద్భాసితంబై కనన్
రాకన్ జ్ఞానధరాధరంబాగిని ప్రారంభించ వర్షింప నీ
యాకారంబు ప్రభోదయం బగునుగాదా? ఆర్తత్రాణమణీ!.

మ. అరవిందాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు నీవై మహా
త్తరమా మాయను లోకజాలముల మిథ్యాకీర్తి గావించి యు
ద్ధరతన్ బొమ్మల బొమ్మలట్లు గుణమాత్రిల్ జేసి యాడించునిన్
శరణేఁ గోరితి నెట్లు ప్రోచెదవో యీశా! ఆర్తత్రాణమణీ!.

మ. అరిషడ్వర్గము ద్రోసిపుచ్చి మదియందారాటముల్మాన్పి,
ను। స్థిరతన్ దావక పాదపద్మముల నర్థిన్ మనోవీధి ని
బ్బరపుణ్య మార్గమునిల్పు సజ్జనునిదే భాగ్యంబు తద్వృత్తి నా
కరయన్ లభ్యముసేయవే దయననంతా! ఆర్తత్రాణమణీ!.

శా. శాపింపన్ గలనైన నొర్కపరి గంగా, గౌతమీ, నర్మదా,
కావేరీ ముఖలైన పుణ్యనదులన్ గాంక్షించి స్నానంబు సు
ద్భావంబెంతయుఁ గోరిధకామముల బంధంబందునం జిక్కటన్,
సీవేశితిని బోరితో? వన్నికను తండ్రి! ఆర్తరక్షామణీ!.

మ. జననంబందిననుండి చేయఁబడు దుష్కార్యంబులన్ దల్పగా
వినుమో తండ్రి! భయానకంబయి మహోపేతిన్ బరివర్తిల్లు చుం
టను దిక్కెవ్వరటంచు భీతిలుచు నున్నానిట్లు దీనుండనై
నను రక్షించిన రక్షకుండవు గదన్నా! ఆర్తరక్షామణీ!.

మ. మునుదైత్యాళము లమృతంబుఁగొని పోఁబోవ న్సురవాత్రి త
ము। తను భీతిల్లుచు నిన్నుఁజేర దయచేతందాల్చు నీరూపు నే
తనులం గాంచిన భాగ్యమింపొదవఁగాఁ గన్పట్టెఁగాఁ జేయరా
జనకా! తన్మసుతుండఁగాన జగదీశా! ఆర్తరక్షామణీ!.

మ. ఖలుఁడైనన్ ఘనుఁడైన దండ్రి సుతుఁడన్ గాపాడఁడే? యింత
గాఁ। జలముచోఁపను బూను నేజనక? త్వత్సాన్వంతంబునందేమియు
మా। ఖలుఁడన్నీసుత తండ్రి! కావుమనినే కాల్సేతుల న్బట్టినా
జలమున్మానక నిల్చియుంట తగదీశా, ఆర్తరక్షామణీ!

మ. అకటా! దీనులపాలి పెన్నిధివి, జ్ఞానానంద సామ్రాజ్యసా
ధక వర్గంబున కాప్తమిత్రుఁడవు, ఆర్తశ్రేణికిన్ దేవతా
నికరపాత్రికట కల్పవృక్షమవు తండ్రి! యిట్లు నీవుండి యిం
చుక మన్మానిధన నాలకించవా? కా? రామా! ఆర్తరక్షామణీ!,

మ. పుడమిన్ బుట్టియు బ్రాహ్మణాన్వయమున న్బ్రోల్లొందఁగా
నందులోఁ। గడనన్గాంచియు దావకాంఘ్రి భజనాకాంక్షన్ విలో
కింప నేఁ। బడుపాటు ల్వచియింపలేను జనకా! ప్రారబ్ధకర్మంబు
నా। కిఁకముల్బెక్కులు దార్చుచుండె గదరావే? ఆర్తరక్షామణీ!

మ. పగవాఁడంతటి వాఁడుగూడ జనకా! పాదంబు లన్పట్టినన్
దగుమాత్రింబు కటాక్షముంచునుగదా త్వత్పాద సంయుక్తచే
నగడన్నిల్చిన నన్నిటుల్ నలిపినన్ నీకేమి సంతోషమా?
తగునే? ధర్మము వీడనొప్పునా? కృపాత్మా! ఆర్తరక్షామణీ!.

మ. నను నీకిత్తిని బాధబెట్టిన జగన్నాథా! నిను న్వీడి యుం
డు నటంచు న్మదినెంచితేని యటు సంతోషింప బోకింక; న
న్నినుమెంతన్ దయఁజూడకున్న నిటుల న్వేయేండ్లునైనన్ నిన్నున్
మనమం దున్నుచు నిల్చియుండుసుమి రామా! ఆర్తరక్షామణీ!.

శా. నీ మానంబుఁ బరిత్యజించి యికనేనిం దీనుఁడన్ గాన నీ
మోమున్ గన్నుల పండువౌనటుల సమ్మోదంబునం జూపి నీ
సాన్నిధ్యంబున నన్నుఁ జేర్పు మదియే చాలైన వేవేగ నీ
వీమాత్రింబు గటాక్షముంచనగు తండ్రీ! ఆర్తరక్షామణీ!.

శా. నీకే కన్నసుతుండనైన నను బోషించుచు లాలింప త్వ
ద్భావంబందున నెంచకున్న నిఁక నైవారెంత పోషింతురో
నీవే కొంచెము దండించుచున్ జనక, తండ్రీ యిట్లు కావించినన్
నైనా రెవ్వరు ప్రోతురన్నను? దేవా, ఆర్తరక్షామణీ.

మ. ననుగావన్ నినుఁగాక వేఱొకరి నెన్నండేని నోరార మ
న్ననముం జెందితినో? మాటవాసితయునన్ నన్నోఁబ్రియము స్వేధిలో
నిను నే నల్వురిచెంత నిల్పితినో? తండ్రీ, యెందుకీర్తి నన్
న్ననుపస్థల్పుక నిల్పితో చెపుము? రామా, ఆర్తరక్షామణీ.

మ. కరినాథాఁడు జలగ్రహంబు బలయుక్తస్ఫూర్తినిన్ బట్టి నం
బరమున్వ్యానుచు దిక్కులేమి యది దేవా, జగద్రక్షకా,
కరుణింపన్ దగునీవెయంచుఁ బలుకన్ గాపాడవే? అంత సు
స్థిర కారుణ్యము మానెగాని కనఁరాదే? ఆర్తరక్షామణీ.

మ. వగవాఁడాగద యావిభీషణుఁడు? బోవన్ గంటకంబూనితే
సిగమాధార! విశేషమేమి? అదియే నీచిత్తమై యున్నచోఁ
దగనే నేనును వానిరీతిఁ గనఁగా? ధర్మంబె నీకిట్లు వన్
బగసాధింపఁ దలంపఁబూనుటలు? దేవా, ఆర్తరక్షామణీ.

మ. సకలంబున్ సమమంచు నిన్నుఁగను విజ్ఞానుల్ప్రవర్తించుచో
సకలాంతః కరుణాన్వితుండవయి వర్జ్యావైఖరిన్ లోకపా
లక సామ్యంబున నెల్గు నీవిటుల ధర్మంబెంతయు న్వీడితే
అకటా! యింతకు బక్షపాతమిది కాదా? ఆర్తరక్షామణీ.

మ. జగమే మందిర మందహాల్యథనమే జ్ఞానంబు, సద్ధర్మమే
తగు సద్వృత్తి, సఖుండె శ్రీమ, అల భక్తవ్రాతమే సేవకుల్,
యుగమే సూత్రము, కాలమే చరితమై యొప్పారు నీచేతిలో
భగవాద్యావార, కావుకావు మదిమే లాఁనార్తరక్షామణీ.

మ. భగవంతుండు కృపాసమేతుండును, దివ్యజ్ఞాన సంశోభితుం
డగునంచుం నిగమంబులెల్లఁ బలుకంగా నీవు తద్వాక్యముల్
బగసాధించెడు రీతి నాశతన దేవా, చూడఁగా నెంచితే
తగునా? ధర్మము నీటఁబుచ్చినటు కాదా? ఆర్త రక్షామణీ.

మ. అలుకన్ బూనిన జెప్పఁజాల వినుమింతైనన్ మహానందప్రదు
బలువై వచ్చు సుజీవనంబుఁ దన గర్భంబందునన్ దాచి పెం
పలరన్ దత్సుభకీర్తిఁ జూపనిక నీకా కీర్తికిన్ హాని నా
వలనన్ గల్గును బ్రోచుచోఁ జెపుమ? దేవా, ఆర్త రక్షామణీ.

మ. అకటా! తల్లివి దండ్రివీవెయని ధ్యానాసక్తన్నిన్నె మా
నక చిత్తంబున నమ్మియుండుటను ధర్మంబు న్విచారించి కా
వక సందర్శన భాగ్యమీయవె? కృపా పారీణతన్ గాంచ సా
త్విక భావంబున నాశ్రితుండఁ గనరాదే? ఆర్త రక్షామణీ.

మ. నిను నేనిట్లు త్రికాలముల్బిల్చుచుఁ దండ్రీ, ఘోరసంసార వా
ర్ధిని నింకెంతని యీదనేర్తు? దరిఁ జేర్పించింక రక్షింపవే
యని నేనెంతగ వేఁడుచున్న నొకనాఁడైనన్ గటాక్షింప రా
వని నిన్ గాంచు పరుల్ నన్నున్ నగరే? దేవా, ఆర్త రక్షామణీ.

మ. ఎవరున్నారని జేరఁబోయెదను? తండ్రీ, తండ్రివౌ నీవె నా
కవమానంబు ఘటింపనెంచిన? మదజ్ఞానంబుకై యిట్లు నేఁ
బవలున్ రేలును గూర్చు లేక మదిలోఁ బల్మార్గముల్ గింతత్రో
వవురా, యుంటుతప్ప దీనత ననంతా, ఆర్త రక్షామణీ.

శా. నాసామర్థ్యము జూడనెంచి యిటులన్నాతండ్రి, బాధించు
చో। నీసామర్థ్యము కేనుమెచ్చ; నను నింతేగాక వేయింతలన్
గాసిన్ జూపిన మన్మనంబు చెదరంగా రాక సుంతైనఁ బై
పై సంతుష్టినె చెందుచుందుసుమి దేవా, ఆర్తరక్షామణీ.

మ. అడుగన్మానిన బెట్టదమ్మయిన గాదా? యంచు రూపించి
నజ్ఞుఁడన్ గాదె? మహాత్మ, మరెట్లువేఁడెద నను న్నాక స్థలం
పూనుమా। కొడుకుల్వేఁడిన వేడకున్న జనకుల్ గోర్కెల్ప్రసా
దింపరే! యెడనైన న్వేఁడనూప గోరితిని తండ్రీ, ఆర్తరక్షామణీ.

మ. మునునిన్వేఁడిన వారికంటె గడు మెప్పుంగాంచ నేనేమి నిన్
జనకా, కోరితినా? మరేదయిన నాసన్మాని బల్వంతమే
నిను నేఁ బెట్టితినా? మరేలనిటు తండ్రీ, బ్రోవ రాజాగు? నన్
గనరాకున్నచో పాదసేవకుఁడఁ గానా? ఆర్తరక్షామణీ!.

మ. దయఁజూడందగు తండ్రి నీవెయునిగాదా? యెంతొ సంతుష్టి
చే। భయమింతైనను జెందకుండ జనకా, త్వత్పాదచింత న్విని
శ్చయబుద్ధిన్ దళుకొత్త నిల్పితిని? నన్నాశించిన న్లేక నీ
నియమంబుల్ గనఁబర్చినన్ సరియె తండ్రీ, ఆర్తరక్షామణీ!.

మ. పరులన్వేఁడను నీదుపాలఁ బడుటన్ పాపంబెడందోఁసి సు
స్థిర కారుణ్య కటాక్షవీక్షణముల న్దేవా, కటాక్షించు నేఁ
బరుఁడన్ గానుగదా? పరాకుతగునా? పాలింపరావా! పరా
త్పర, దీనావన, యోరమేశ, పరమాత్మా ,ఆర్తరక్షామణీ!.

శా. నీకన్న న్మరదిక్కు వేఱెవరు తండ్రీ, నీవె కాకున్న నీ
లోకంబందుఁ గలట్టి యార్తులకు? ముల్లోకంబులన్ గాంచినన్
నీకున్ మించిన తండ్రిఁ గాంచఁగలమే? నీవేమి కావించినన్
హా, కంకేశుఁడా, నీదె భారముగాదే? ఆర్త రక్షామణీ!

శా. నాదౌ పూర్వభవార్జితంబు కలనైనన్ గాంచనీకుండ నా
మీఁదన్ ప్రేమది యెంతయున్న నొసరింపించన్ విలోకింపఁగా
రాదంచెంచెదఁ గాని తండ్రీ, కనులారన్ బోని నీవైనఁ ద్వ
త్పాదంబు ల్గనఁ బర్వఁ జాలవుకొ? దేవా, ఆర్త రక్షామణీ.

శా. ఏయే పాపము లెన్నిసారులను మున్నేఁజేసి జన్మించితో
నా యీపాట్లను జూచుచుంటివి గదా? నాతండ్రి, యిం కేలనన్
వేయార్వ విధంబులన్నిఁటను గన్నీరోడ్వఁగాఁ జేయు? నీ
వే యీరీతి నొసర్ప నేమనెద? తండ్రీ, ఆర్త రక్షామణీ.

శా. అజ్ఞానంబునఁ జేసినట్టి కృతకృత్యంబు ల్మదిం దల్చి న
ర్విశిష్టత్వంబగు నీమహాత్మ్యమును దివ్యంబైన త్వత్తేజముల్
బాల్విజ్ఞత్మలకుఁ జూపకుంట దగునే? భావ్యంబె నీకిట్లు మో
హక్షానార్థుఁ గష్టపెట్టుటలు? దేవా, ఆర్త రక్షామణీ!

శా. కారుణ్యామల వార్ధిచంద్రుఁడని నిన్ గాంక్షించి యుంటన్
మహో! దారిద్ర్యార్తతఁ జేరఁదీసి నను వాత్సల్యంబుచే గద్భవా
కారం బుద్ధరించావె దేవతల దక్షత్వంబునన్ బ్రోచిన
ట్లేరా, తండ్రి, సుతుండనాఁటఁ గనరాదే? ఆర్త రక్షామణీ!

శా. పరులన్ జూచినభంగి చూచుటలు న్యాయ్యంబె? నాతండ్రి,
నేఁ బరుఁడై యింతటఁదోఁచితే జగములెప్పాటున గనన్ జాలితో?
కరుణన్ బ్రోవఁబలినట్లు బ్రోచితివా? ఏకన్ నాటి వ్రిష్ఠోదు నే
వరువన్ బ్రోచితొ? నీదు చూచుటిక దేవా, ఆర్తరక్షామణీ!.

మ. మనసా, లోకము పాపమా గదవె; సమ్యగ్జ్ఞానవ త్ప్రేక్షచే
జనకా చూప్పటను నింద్రియాళి నిను నానల్ జూపి దుఃఖాబ్ధిలో
మునుఁగన్ జేయు నటంచు జెప్పినను తన్మార్గత్వము న్యాయమో
జనకా, ప్రోవవె దీనుఁడన్ గనుక నీశా, ఆర్తరక్షామణీ!.

మ. కలలోఁగాంచిన వస్తువుల్పలెను లోకంబన్న మత్పూర్వపున్
ఫలమే మోగద తుచ్ఛసౌఖ్యములపై భావం బొకొక్కప్పుడు
మ్మొయ్యలపై నూఁగెదు చందమున్ననుము; నయ్యాటోపమున్మాన్పి ని
శ్చల చిత్తంబును జేయ వేఁడెదను ఈశా, ఆర్తరక్షామణీ!.

మ. జనకా, చేసిన పాపముల్దలఁచి పశ్చాత్తాప తప్తుండనై
కనులం దశ్రుజలంబుగార మిగులన్ గాపాడరమ్మంచు హా!
నిను నే ప్రార్థనఁ గోరుచున్న నిటు తండ్రీ, బ్రోవరావుంద నా
గొనరింపన్ దలపోయధర్మము? కృపాళూ, ఆర్తరక్షామణీ!.

మ. శరణన్నన్ దయతోడఁ బ్రోచుటయె నీసంకల్పసంసిద్ధి యు
ట్లురులన్ గూడను బ్రోచు నీకు ననునాయాసంబు పాల్సేయ నం
బరమే? తండ్రి పక్షపాతమును భావ్యంబా? న వ్యాసంగ? భా
వరసజ్ఞత్వము బ్రాపునింకయువ దేవా, ఆర్తరక్షామణీ!.

శా. ఏనాఁడో యెటువంటి దోషములనో యేఁ జేసినానంచు న
న్నీనాఁడిట్లలయింపనేల? జనకా, యేఁ జేయఁగాఁ జూచువా
రానాఁడెవ్వరొ కాని, నీవిభ్రమున న్యాయాసనమున్ బెట్టుచో
నీనాఁడెల్లరు జూచువారె కద తండ్రీ, ఆర్తరక్షామణీ!.

మ అపకారం బొనరించు వారలకు దివ్యజ్ఞానసంసిద్ధిఁ బ్రో
త్యుపకారం బొనరింపరా సుజనులే యన్నా, యదట్లుండి సర్
నవముంజూచి తపింపనెంచ దగునే? నీవాఁడ నేఁగాన? వే
లుపువై నాగతి నిట్లు సేతువె? కృపాళూ, ఆర్తరక్షామణీ!.

శా. మున్నే చేసిన పట్టుబున్న నియమప్రోద్దల్ సదావ్యాకృతం
బెన్నన్ నిశ్చితవాఁడనై భయదమౌ యీ ఘోర సంసారమున్
తన్నార్యంబునఁ గూలకుండుటకు నిన్నే నమ్మి నన్నేల నో
యన్నా, మూర్తిని ముంచఁజూడ? తగదన్నా, ఆర్తరక్షామణీ!.

శా. భావంబెంతయు లేక వృత్తినికుతిన్ భాషింపఁగా లేమ నే
నీవాఁడ మది సంశయింపకుము నన్నే ప్రేమ నీక్షింపఁగా
నీవే యొంకయు దిక్కుగాన నికనైనన్ వేగ లాలింపఁగా
రావే యుర్వీ, జాలమూను చలమేలా? ఆర్తరక్షామణీ!.

మ. తగదీకిద్ది గటాక్షుఁకుంచెకవనున్ దైన్యంబు పొందించి పో
షగ సాంధింపఁ దలంపఁబూన కనకా, పైవాఁడ గానే కదా?
నిగమంబుల్ భవదీయ మదర [illegible] తెలియ స్వనోల్లతో జాటుచో
మగునందున్ నన్ను [illegible] చేవ్వా, ఆర్తరక్షామణీ!.

శా. నాకేలోపము రాదు; వచ్చిన జగన్నాథుండవౌ నీవు న
న్క్షేమము జేతువంచు మదినెంతో మోదమున్ గాంచుచున్
నీ కారుణ్యముకై యిటుల్ నిలిచి యుంటిన్ గాని స్వప్నంబునన్
నాకే కర్మము దెత్తువంచెఱుఁగ నన్నా! ఆర్తరక్షామణీ!.

శా. ఏదో యింతటి మత్పురాకృతము నన్నీరీతి బెగ్గప్పమున్
గాదన్నారలు లేమి చూపినను వేగంబింక మోదంబుగా
నా దీనత్వము నాల్పరమ్మికను; నన్యాయంబు లేకున్నన
వాదంబేలను? దిక్కు నీవెకద దేవా! ఆర్తరక్షామణీ!.

మ. జననంబందుచు ఘోరపాపములచే; సంసారమందుంటి నే
న్నను ఈరీతిని దిక్కులేక తనువంతల్ పొందుటింకెంత నో
యనఘా! పాపము నీవు చెప్పవలెనే? యైనన్ భవత్పాద చిం
తన చేకూరుట ముక్తికర్తృఁడను గాదా? ఆర్తరక్షామణీ!.

శా. అన్నా! ఇన్నిమరేల? నామదిని యున్నట్లింత సక్రంబుగా
నిన్నుఁ గూర్చి వచించుచుంటి నను నంతే బాధలన్ జూపినన్
నిన్నే నేమరి యుండకుండునటు లెన్నొంటన్ నిల్చి యున్నాఁడని నీ
కన్నింపందగు నీవు నన్నుఁ గని రామా! ఆర్తరక్షామణీ!.

మ. జపహోమార్చలు లెట్టివో, ఘనతప స్స్వాధ్యాయయజ్ఞంబుల్
భవ! తత్త్వజ్ఞతకై యేగతిఁ జేయుటో యెఱుఁగ సుంతైన రాని మూ
ఢుఁడనై! చపలస్వాంతుడనైన నీకృతిని వక్కాణింతుఁ బూ ద్వత్స
న్నిధి! నిపుణత్వంబునన్నిల్ప నిచ్చితిని తండ్రీ! ఆర్తరక్షామణీ!.

సంపూర్ణము.

శ్రీ సీతా రామార్పణమస్తు.

